# NITIMUKTAVAL

PART 1

---

(Poetical selections
from Mahabharata Etc)



ANDHRAPRACHARINI PRINTING WORKS,

NIDADAVOL.

1917.

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

అనుబంధగ్రంథమాల. 43.

శ్రీరామచంద్ర.

# నీతిముక్తావళి

(ప్రథమభాగము.)

శ్రీమదాంధ్రమహాభారతమునుండియు,

భర్తృహరినీతిశతకమునుండియు

ఏర్చికూర్పఁబడినది.

మొదటికూర్పు.

ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1917.

వెల రు. 0 6—0.

# పీఠిక.

పాఠశాలలోఁ జదువుబాలురకు నిర్దుష్టభాషయలవడుటకును, సుజ్ఞానము చొప్పడుటకును, సుగుణసంపద చేకూఱుటకును, శ్రీమదాంధ్రమహాభారతమునుండియు, భర్తృహరి నీతిశతకమునుండియు నీనీతిపద్యములను సేకరించి నీతిముక్తావళి యనుపేరునఁ బ్రథమభాగముగాఁ బ్రకటించినాఁడను. పాఠశాలాధిపతులును, విద్యాశాఖాధికారులును దీని నాదరించి బాలురకుఁ బఠనీయగ్రంథముగా స్వీకరించినచోఁ గృతార్థుఁడనయ్యెదను.

నిడదవోలు,
10—8—17. } బాలాంత్రపు వేంకటరావు.

# విషయసూచిక.

శ్రీరామచంద్ర

# నీతిముక్తావళి

---

## దైవభక్తి.

గీ. అఖిలజీవంబులకుజీవ • మైనవాఁడు
అఖిలకర్మములకు సాక్షి • యైనవాఁడు
అఖిలలోకేశ్వరుండగు • నాదిదేవు
నాత్మభజియింతు భక్తితో • ననుదినంబు.

ఉ. ఈశ్వర! సద్విలాస! పర • మేశ్వర! భాస్వరసత్కృపాకరా!
శాశ్వతరూపదీపక! వి • శాలజగద్రచనావినోద! లో
కేశ్వర! సాధుపక్షవిమ • లేక్షణ రక్షణ! దుష్టశిక్షణా!
విశ్వమయాంతరంగ! పరి • వేష్టితసజ్జన! భక్తపాలకా!

గీ. ప్రాణిలోకంబులోజ్ఞాన • పటిమఁగన్న
మానవుఁడు సర్వశోభనా • స్థానమైన
దివ్యతరదైవభక్తి సా • ధించెనేని
ఐహికాముష్మికసుఖంబు • లందుటరిదె?

---

## మాతృభక్తి.

---

ఆ. బాలుఁడైనఁగొడుకు ♦ ప్రౌఢుఁడైననువృద్ధుఁ
డైననొక్కవిధమ ♦ యర్మిలియును
నరయుభరముఁదల్లి ♦ కాపదార్థంబు జ
గంబుకలిమికెల్లఁ ♦ గారణంబు.

ఆ. క్షుద్రజంతువులకు ♦ గురులకునెమ్మియుఁ
దలఁపనొక్కరూప ♦ తల్లివలయు
నూఱడిల్లఁగలదె ♦ యెందుసోటుల సువ
స్తువు నివాసమైన ♦ చోటఁగాక.

క. అప్పుడయుసమర్థుండగు
నప్పుడ దుఃఖయగుశూన్య ♦ మైతోఁచు జగం
బప్పుడ మాతృవియోగం
బెప్పుడు వాటిల్లె నవుడ ♦ యెంతయుఁదూలున్.

క. కలవాఁడు లేనివాఁడు స
బలుఁ డబలుఁడు మూఢబుద్ధి ♦ ప్రౌఢుండనఁగా
వలదెవ్వరికైన జనని
కలిమియ యత్యంతసౌఖ్య♦ కరమైయుండున్.

---

## పి తృ భ క్తి.

క. జనకుఁడు దపమును ధర్మం
బును విద్యయుఁ బరమదైవ • మునుగావున నా
తనికిఁ బ్రియంబగు పని సే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ • జెందుట గల్గున్.

## గు రు భ క్తి

క. గురుభక్తి కళారత్నా
కరతరణముశిష్యజీవి • కావరణంబున్
గురుభక్తి గలుగువారల
కరుదే సకలార్థసిద్ధి • యగుటధరిత్రిన్.

## గు రు జ న భ క్తి.

సీ. వినుతల్లియును దండ్రి • యును గురుండును సేవ
నీయులు సద్భక్తి • నిత్యనిరతి
వారలఁగొలుచుచు • వారెద్దిసెప్పిన

నదియాచరించుట ♦ యధికధర్మ
మాగమత్రయమును ♦ నగ్నిత్రయంబు లో
కత్రయంబును దేవ ♦ తాత్రయంబు
వనువస్తువులువార ♦ లందును జనని గౌ
రవమున నెక్కుడు ♦ రాజవర్య
తే. యీజగంబున దివమునం ♦ బూజవడయు
మాతృభక్తుండు పితృభక్తి ♦ మానసుండు
నట్ల యవ్యయానంద సం ♦ ప్రాపణంబు
గురుపదాబ్జసమారాధ ♦ కుండుఁగాంచు.

రా జ భ క్తి.

సీ. దర్శనీయంబైన ♦ దైవంబు భూపాలుఁ
డిహామును వెలింగించు ♦ నినుఁడు విభుఁడు
చనవునఁబోషించు ♦ జనకుండు నృపమౌళి
తమిమీరనలరించు ♦ తల్లిప్రభువు
గుణదోషములఁదెల్పు ♦ గురుఁడు మహీంద్రుడు
హితముఁజెల్పెడి పురో ♦ హితుఁడురాజు
మేలొనఁగూర్చు స ♦ న్మిత్రుఁడు క్షితీశుండు
తలఁపులనీడేర్చు ♦ దాతనృపతి
తే. మహితమహిమాయుతుండుపే ♦ మప్రపూర్ణుఁ
డనుపమజ్ఞానసంపన్నుఁ ♦ డాత్మ సుస్వ

భావకలితుండునగు నర • పాలుఁ డెకడ
యవనిజనులకు నన్నియు • నైనవాఁడు !

ఉ॥ క్రోఁతియెయయ్యుమారుతియ•కుంఠితవిక్రముఁడై యపారవి
ఖ్యాతిపయోనిధింగడవఁ•గల్గెను, సూతుఁడెయయ్యుఁగర్ణుఁడా
స్ఫీతచరిత్రుఁడై నృపతి • సేవితుఁడయ్యెఁ; దలంచిచూడఁగా
వాతతరాజభక్తులకు • నందఁగరాని యభీష్టముండునే ?

సీ. శ్రీమద్వసుంధరా • స్థితజనోన్నతిఁగూర్చు
పరిథితపరిభాశక్తి • రాజభక్తి
ధర్మార్థకామము • క్తాచయంబు లొసంగు
రమణీయతరశక్తి • రాజభక్తి
సంతత సన్మార్గ • సరణిఁబరిబోధించు
పాలించదాగమనూక్తి • రాజభక్తి
అనవద్యభువనయా • త్రానందముఘటించు
రమ్యనౌకాయుక్తి • రాజభక్తి
తే. సకలభూమండలికిని బ్రి • శాంతమైన
తేజమిడునద్భుతవ్యక్తి • రాజభక్తి
అఖిలజనులకనంతసౌ • ఖ్యంబునిచ్చు
రాజితామృతభుక్తి శ్రీ • రాజభక్తి.

---

## మూర్ఖపద్ధతి.

క. తెలియనిమనుజునిసుఖముగఁ
దెలుపందగుసుఖతరముగఁ • దెలుపఁగవచ్చుం
దెలిసినవానిం దెలిసియుఁ
దెలియనినరుఁ దెల్ప బ్రహ్మ • దేవునివశమే ?

చ. మకరముఖాంతరస్థమగు • మానికముం బెకలింపవచ్చుఁ బా
యక చలదూర్మికానికర • మైనమహోదధిదాఁటవచ్చు మ
స్తకమునఁ బూవుదండవలె • సర్పమునైన ధరింపవచ్చు మ
చ్చికఘటియింపమూర్ఖజన • చిత్తముఁ దెల్పనసాధ్యమేరికిన్.

తే. తివిరియిసుమునఁ దైలంబుఁ • దీయవచ్చుఁ
దవిలిమృగతృష్ణలోనీరుఁ • ద్రావవచ్చుఁ
దిరిగికుందేటికొమ్ము సా • ధింపవచ్చుఁ
జేరిమూర్ఖులమనము రం • జింపరాదు.

చ. తెలివియొకింత లేనియెడఁ • దృప్తుఁడనై కరిభంగి సర్వముం
దెలిసితినంచుగర్వితమ • తిన్ విహరించితిఁ దొల్లియిప్పుడు
జ్జ్వలమతులైన పండితుల • సన్నిధినించుక బోధశాలినై
తెలియనివాఁడనై మెలఁగి • తింగతమయ్యెనికాంతగర్వమున్

---

## విద్వత్పద్ధతి.

---

చ. సకలకళావిభూషితులు ♦ శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రు లేనృపతి ♦ పజ్జను నిర్ధనులై చరింతు రా
వికృతపుజాడ్యమా దొరది ♦ విత్తము లేకయ వారుపూజ్యులం
ధకజనదూషితంబులు ఘ♦నంబులుగా వెయమూల్యరత్నముల్

ఉ. హర్తకుఁ గాదు గోచరము ♦ హర్నిశమున్ సుఖపుష్టి సేయుస
త్కీర్తి ఘటించు విద్యయను ♦ దివ్యధనం బఖిలార్థికోటికిన్
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ ♦ బోదు యుగాంతపువేళనైన భూ
భర్తలు దద్ధనాధికుల ♦ పట్టున గర్వము మానుటొప్పగున్.

తే. ప్రభులు పండితులగువారి ♦ వలన గర్వ
కలనమానుఁడు వారు మీ♦కలిమి తృణము
లీలఁ బోలింపలేమి మృ♦ణాళగుణము
భూరిమదవారణములకు ♦ వారణంబె!

చ. వనజభవుండు గోపమున ♦ వాహనమైన మరాళభర్తకున్
వనజవనీవిహారకల ♦ నంబు దొలంగఁగఁ జేయుఁగాని గుం
భనమున దుగ్ధజీవన వి ♦ భాగవిధాన నిరూఢనైపుణీ
జనితమహాయశోవిభవ ♦ సారము హంసకు మాన్పఁజాలునే.

ఉ. భూషలుగావు మర్త్యులకు ♦ భూరిమయాంగదతారహారముల్
భూషితకేశపాశమృదు ♦ పుష్పసుగంధజలాభిషేకముల్

భూషలుగావుపూరుషుని • భూషితుఁజేయు పవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము • భూషణముల్ నశియించునన్ని
[యున్]

ఉ. విద్యనిగూఢగుప్తమగు • విత్తముఁరూపముపూరుషాళికిన్
విద్యయశస్సుభోగకరి • విద్యగురుండు విదేశబంధుఁడున్
విద్యవిశిష్టదైవతము • విద్యకుసాటిధనంబు లేదిలన్
విద్యనృపాలపూజితము • విద్యనెఱుంగనివాఁడుమర్త్యుఁడే.

చ. క్షమగవచంబుగ్రోధమది • శత్రువుజ్ఞాతిహుతాశనుండుమి
త్రముదగుమందుదుర్జనులు • దారుణపన్నగముల్ సువిద్యవి
త్తముచితలజ్జభూషణము • దాత్తకవిత్వమురాజ్యమీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగు • పట్టునఁదత్కవచాదులేటికిన్

తే. సత్యసూక్తిఘటించు ధీ • జడిమమాన్చు
గౌరవమొసంగు జనులకుఁ • గలుషమడఁచుఁ
గీర్తిఁ బ్రకటించుఁజిత్తవి • స్ఫూర్తిఁజేయు
సాధుసంగంబు సకలార్థ • సాధనంబు

## మానశౌర్యపద్ధతి.

తే. ప్రాణిలోకంబునంసార • పతితమగుట
వసుధపైగిట్టిపుట్టని • వాఁడుగలఁడె
వానిజన్మంబుసఫలమె • వ్వానివలన
వంశమధికోన్నతి వహించి • వన్నెకెక్కు.

తే. కుసుమగుచ్ఛంబునకుఁబోలె • బొసఁగు శౌర్య
మానవంతునకిరెండు • మహితగతులు
సకలజనమస్తక ప్రదే • శముల నైన
వనమునందైన శీర్ణభావంబుగనుట.

మ. భువనశ్రేణివహించు శేషుఁడుఫణా • భోగంబుపైనంతతం
బవలీలన్ భరియించుఁ బృష్ఠమునఁ గూర్మాధీశ్వరుండాతనిన్
ధవళక్రోడవశాత్తుఁ జేయునతనిన్ • వారాశియశ్రాంతిచే
నవురా! ధీరచరిత్రసంపదలనం • ఖ్యాతప్రభావోన్నతుల్.

తే. అర్కకాంతము చేతనం • బయ్యు సవితృ
పాదములు సోఁకినంత నే • ప్రజ్వరిల్లుఁ
గానభిమానవంతుఁడెం • దైన శత్రు
కృతతిరస్కారమెట్లు స • హింపనేర్చు.

## అర్థపద్ధతి.

క. ఏనరునకు విత్తముగల
డానరుఁడు కులీనుఁ డధికుఁ • డార్యుఁడతండే
ధీనిధి ధన్యుఁడు సేవ్యుఁడు
నానాగుణగణము కాంచ • నంబున నిలుచున్.

మ. యతిసంగంబునబాలుఁడాదరముచే • క్ష్మాభర్త దుర్మంత్రిచే
శ్రుతిహానిన్ ద్విజుఁడన్వయంబుఖలుచే • కుప్రాప్తిచే శీల ము
ద్ధతిచే మిత్రత చూపులేమిఁగృషి మ • ద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచేసంపదలున్ నశించుఁ జెడు న • ర్థంబుల్ ప్రమాదంబు
[నన్.]

క. దానము భోగము నాశము
పూనికతో మూఁడుగతులు • భువిధనమునకున్
దానము భోగము నెఱుఁగని
దీనునిధనమునకుఁగతి దృ • తీయమెపొసఁగున్

తే. ధరణి ధేనువుఁ బిదుకంగఁ • దలఁచితేని
జనులఁబోషింపుమధిప వ • త్సములమాడ్కిఁ
జనులుపోషింపఁబడుచుండ • జగతికల్ప
లతతెఱంగున సకలఫ • లంబులొసఁగు.

---

## దుర్జనపద్ధతి.

తే. విద్యచేభూషితుండయి • వెలయుచున్నఁ
దొడరివర్జింపవగుఁజుమీ • దుర్జనుండు
చారుమాణిక్యభూషిత • శస్తమస్త
కంబయినపన్నగము భయం • కరముగాదె.

శా. హీరవ్యూంజనుఁగాఁగసువ్రతునిమా•యింగాశుచిందం [భిఁగా]
శూరున్నిర్దయుఁగామునిన్విమతిఁగా•శ్రోత్రిప్రియాలాపుని
స్సారుంగాబలవంతుగర్వితునిగా • సద్వక్త వాచాలుఁగాఁ
గ్రూరుండెన్నిసుధీగుణంబుదురితా • రూఢంబుజేయుంగదా!

తే. మొదలఁజూచినఁగడుగొప్ప • పిదపఁగురుచ
యాదిఁగొంచెము తర్వాత • నధికమగుచుఁ
దనరుదినపూర్వాపరభాగ • జనితమయిన
చాయపోలికఁగుజన స • జ్జనులమైత్రి.

తే. కసవుచే, నీటిచే, మోద • కలనచేత
బ్రతుకుమృగమీన సజ్జన • ప్రకరమునకు
శబరకైవర్తసూచక • జనులుజగతిఁ
గారణములేనిపగవారు • గారెతలఁప.

## సుజనపద్ధతి.

ఉ. ఆపదలందుధైర్యగుణ,• మంచితసంపదలందుఁదాల్మియున్
భూపసభాంతరాళమునఁ • బుష్కలవాక్చతురత్వ మాజిబా
హాపటుశక్తియున్యశము•నందనురక్తియువిద్యయందువాం
ఛాపరివృద్ధియున్బ్రకృతి • సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

చ. కరము నవనిత్యదానము ముఖంబున సూనృతవాణియాదరం
గురుచరణాభివాదన ము కుంఠితవీర్యముదోర్యుగంబునన్
దరహృదయంబునన్ విశద వర్తన మంచితవిద్య వీనులన్
సురుచిరభూషణంబులివి శూరులకున్ సిరి లేనియప్పుడున్.

తే. సంపదలుగల్గుతఱి మహా జనులహృదయ
ముభినవోత్పలకోమలం బగుచు వెలయు
నాపదలువొందునపుడు మ హామహీధ
రాశ్మసంఘాతకర్కశం బై తనర్చు.

మ. అసమానప్రియనీతివర్తనము ప్రాణాంతంబునందున్ మలీ
మసమగు వ్యామదుష్టయాచనవసంపత్ప్రార్థనాభావమున్
వ్యసనావాప్తి నిధైర్యము బుధజనా త్యంతానుకూలత్వమీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహార్య శ్రేణికిం దెల్పెనో!

ఉ. నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు నా
నీరమె ముత్యమట్లు నళి నీదళసంస్థితమై తనర్చు నా
నీరమె శుక్తిలోఁబడి మ ణిత్వముగాంచు సమంచితప్రభం
బౌరుషవృత్తులిట్లధము మధ్యము నుత్తముఁగొల్చువారికిన్.

చ. పతులగుచున్ మహోన్నతిఁ ద నర్చుచు నన్యగుణోక్తిచే
[గుణో]
న్నతిఁబ్రకటించుచుం బరజ సప్రియకార్యసమర్థతన్ సమం

చితనిజకార్యసంగ్రహముఁ జేయుచునిష్ఠురవాదులన్ క్షమా
ధృతినిరసించుచుండరఁగు ధీరులుపుణ్యులుగారె యేరికిన్.

## పరోపకారపద్ధతి.

గీ. తరువులతిరసఫలభార గురుతగాంచు
నింగివేల్లుచు నమ్రత నొంసంగు మేఘుఁ
డుద్ధతులుగారు బుధులు స మృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.

గీ. అమరుఁజెవిశాస్త్రమునఁగుండ లమునఁగాదు
వలయమునసొప్పదీవిచే వెలయుఁబాణి
యురుదయాఢ్యులమేను ప రోపకార
కలన రాణించు గంధంబు వలనఁగాదు.

తే. ద్యుమణిపద్మాకరము విక చముగఁ జేయుఁ
గుముదహర్షంబుఁ గావించు నమ్రతనూతి
యర్థితుఁడు గాక జలమిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితా చరణమతులు.

మ. తమకార్యంబుఁబరిత్యజించియుఁబరార్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబుఘటించుచున్ బరహితార్థవ్యా పృతుల్ మ
[ధ్యముల్]

దమకైయన్యహితార్థఘాతుకజనుల్ ♦ దైత్యుల్ వృథాన్యార్థభం
గముగావించెదువారలెవ్వరో యెఱుం ♦ గన్ శక్యమే యేరికిన్.

తే. అఘమువలనమఱల్చు హి ♦ తార్థకలితుఁ
జేయు గోప్యంబుదాఁచుఁ ♦ బోషించు గుణము
విడువఁ డాపన్ను లేవడి ♦ వేళ నిచ్చు
మిత్త్రుఁ డీలక్షణంబుల ♦ మెలఁగుచుండు.

ఉ. క్షీరము మున్ను నీటికొసఁ ♦ గెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్
క్షీరము దప్తమౌటఁ గని ♦ చిచ్చుటికెన్ వెతచే జలంబు దు
ర్వారసుహృద్విపత్తిఁ గని ♦ వహ్నిఁ జొరం జనె దుగ్ధమంతలో
నీరముఁ గూడి శాంతమగు ♦ నిట్టి మహాత్ముల మైత్రి యీగతిన్

శా. ఆశాసంహరణంబు నోర్మియు మద ♦ త్యాగంబు దుర్దోషవాం
ఛాశూన్యత్వము సత్యమున్ బుధమతా ♦ చారంబు సత్సేవయున్
వైశద్యంబును శత్రులాలనము మా ♦ న్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుఁ గృపయున్ ♦ శిష్టాళికిన్ ధర్మముల్.

చ. హృదయవచశ్శరీరముల ♦ నెంతయుఁ బుణ్యసుధాపరిపూ
[ర్ణులై]
ముదము బహూపకారముల ♦ మూఁడు జగంబులకున్ ఘటిం
[చుచున్]
వదలక సాధుసద్గుణ ల ♦ వంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తులగు ♦ మాన్యులు గొందఱు వొల్తు రిద్ధరన్

## ధైర్యపద్ధతి.

---

తే. తనిసిరే వేల్పులుదధి ర • త్నములచేత
వెఱచిరే ఘోరకాకోల • విషముచేత
విడిచిరే యత్నమమృతంబు • వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు • నిపుణమతులు.

శా. ఆరంభింపరు నీచమానవులు వి • ఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురు వి • ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ • ధృత్యున్నతోత్సా [హులై]
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ • ప్రజ్ఞానిధుల్ గావునన్.

మ. ఒకచో నేలనుఁబవ్వళించు,నొకచో • నొప్పారుఁబూసెజ్జపై
నొకచో శాకములారగించు నొకచో • నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంతధరించు నొక్కొకతఱిన్ • యోగ్యాంబర శ్రేణిలె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుః • ఖంబున్ సుఖంబున్ [మదిన్.]

శా. నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ • నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతింజెందినసంపదల్ నిలువనీ • గాఢంబుగాసాఁగనీ
ఘాతంబప్పుడపొందనీనియతిమై • కానీయుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబుదప్పరుగదా • నిత్యంబుధీరోత్తముల్.

గీ. నియతిచేతఁగదర్థితుం ♦ డయినధైర్య
పరునిధైర్యగుణంబు మా ♦ న్పంగఁదరమె ?
క్రిందుసేయంగఁబడినట్టి ♦ కృష్ణవథుని
కీలలెందయిన మీఁదుగాఁ ♦ గెరలుఁగాదె ?

చ. ఉపతరపర్వతాగ్రమున ♦ నుండిదృఢంబగుఱాతిమీఁదస
త్వరముగఁదెళ్లికాయముహ ♦ తంబుగఁజేయుటమేలుగాని మే
పరిదారవాఁతఁగేలిడుట ♦ బాగుహుతాశనమధ్యపాతమున్
పరమగుఁజారుశీలగుణ ♦ వర్జనమర్హముగాదు చూడఁగన్.

చ. అతనికి వార్ధితుల్యయగు ♦ నగ్నిజలంబగు మేరుశైలమం
చితశిలలీలనుండు మద ♦ సింహముజింకతెఱంగుఁదాల్చుఁగో
పితఫణిపూలదండయగు ♦ భీష్మవిషంబు సుధారసంబగున్
క్షితిజనసమ్మతంబగు న ♦ శీలముదెవ్వనియందుశోభిలున్.

తే. ఖండితంబయ్యుభూజంబు ♦ వెండిమొలచు
క్షీణుఁడయ్యునభివృద్ధిఁ ♦ జెందుసోముఁ
డివ్విధమునవిచారించి ♦ యొడలుదెగిన
జనములకుఁదాపమొందరు ♦ సాధుజనులు.

ఉ. జానుగభూతికిందొడవు ♦ సజ్జనభావముశౌర్యలక్ష్మికిన్
మానమునీతివిద్యకుశ ♦ మంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానముదాల్మిశక్తికిని ♦ ధర్మనిరాధికదంభవృత్తియుం
బూనికతోడసర్వగుణ ♦ భూషణమొప్పఁగ శీలమేసుమీ.

## దైవపద్ధతి.

క. కందుకమువోలెసుజనుఁడు
గ్రిందంబడిమగుడమీఁది • కిన్నెగయుసుమీ
మందుఁడు మృత్పిండమువలె
గ్రిందంబడియడఁగియుండుఁ • గృపణత్వమునన్.

చ. దొసఁగులు వచ్చువేళగుణ • ధుర్యులు ధైర్యగుణంబు స [ర్వముం]
బస చెడునంచుఁజూ చెదవు • పాపవుదైవమయాదురాగ్రహ
వ్యసనము మానుమానుపశ్రి • యంబునవీతనిజక్రమంబులై
నసి సెడవించుకంతయును • సాగరముల్ గులపర్వతంబులున్.

---

## విద్య.

---

గీ. విద్యయొసఁగును వినయంబు • వినయమునను
బడయుఁబాత్రత, పాత్రత • వలనధనము
ధనమువలనను ధర్మంబు • దానివలన
నైహికాముష్మిక సుఖంబు • లందునరుఁడు.

క. ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ • బొనరించును స
జ్జనులైనవారికడఁకువ
యును వినయము నివియె తెచ్చు • నుర్వీనాథా.

సత్యము—సూనృతము.

చ. నుతజలపూరితంబులగు • నూతులునూఱిటికంటెనూన్నత
వ్రితయొక బా[illegible]లు మఱి • బావులునూఱిటికంటెనొ
[క్కస]
త్క్రతువది మేలుతత్క్రతు • శతంబునకంటెసుతుండు మేలుత
త్సుత శతకంబుకంటెనొక • సూనృతవాక్యము మేలుసూడఁగన్.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయునునొక్కసత్య • మును నిరుగడలం
దులనిడి తూఁపఁగసత్యము
వలననములు సూపు గౌర • వంబున పేర్మిన్.

తే. సర్వతీర్థాభిగమనంబు • సర్వవేద
సమధిగమముసత్యంబుతో • సరియుఁగావ
యెఱుఁగుమెల్లధర్మంబుల • కెందుఁబెద్ద
యందురిసత్యంబుధర్మజ్ఞు • లైనమునులు.

క. ధీరమతియుక్తిఁ జేసి వి
చారింపఁగ నిక్కువంబు • సర్వజనస్వ
ర్గారోహణసోపానం
బారఁగ సత్యంబ చూవె • యతిరమ్యమగున్.

క. సమతయుఁ దమముఁ దితిక్షయు
నమత్సరము హ్రీయు ధృతియు • ననసూయార్య
త్వములు నహింసాదాన
క్షమాత్యజనసూనృతములు • సత్యముమూర్తుల్.

క. సత్యాకృతులగుగుణములు
నిత్యానుష్ఠితసమగ్ర • నిర్మలయోగ
స్థిత్యభిముఖునకు సులభము
లత్యంతసుఖప్రదంబు • లవికార్యంబుల్.

చ. కుదురుసమస్తధర్మముల • కున్ వినుసర్వము యోగమోక్షస
త్ప్రదములుసత్యవాక్యములు • పాపమసత్యముకంటెనొండు లే
దుతలఁపనశ్వమేధములు • దొమ్మదినూఱులు వెండినూఱునై
యొదవిననీడుగావు భర • తోత్తమ సత్యముతోడనారయన్

## అనృతదోషము.

ఆ. ధర్మవేత్తకైఁగిదానిఁ • దా నొండుగా లాభ
లోభపక్షపాత • లోలబుద్ధి

సభలనెవ్వఁడేని • సభ్యుఁడై పలుకువాఁ
డనృతదోషఫలము • ననుభవించు.

క. తనయెఱిఁగినయర్థంబారుఁ
డనఘాయిదియెట్లుసెప్పు • మనియడిగినఁ జె
ప్పనివాఁడును సత్యము సె
ప్పనివాఁడును ఘోరనరక • పంకమునఁబడున్.

ఆ. సభకువచ్చి ధర్మ • సందేహమడిగిన
నెఱిఁగి చెప్పకుండి రేని • సభ్యు
లనృతదోషఫలము • నందర్థమొందుదు
రనిరిధర్మవేదు • లైన మునులు.

---

## జ్ఞానము.

---

క. జ్ఞానము మదమానంబుల
మానుచుసుజనులకునిచ్చు • మఱికొందఱకున్
జ్ఞానికిఁగామికివిజన
స్థానము ముక్తియునురక్తి • దానొసఁగుగతిన్.

---

## అజ్ఞానము.

---

క. రోషము శోకము రాగ
ద్వేషములభిమానదర్ప • వేగాలస్య
శేషము లజ్ఞానమని మ
నీషిజనము సెప్పు మాన • నీయచరిత్రా.

---

## ధర్మము.

---

క. చలము సిరి చలము ప్రాణము
చలమరయఁగ జీవనంబు • జవ్వనమతిచం
చలమగు సంసారమునం
దలఁపఁగనిశ్చలన మొక్క • ధర్మముకాదే.

క. ధర్మజ్ఞులైనపురుషులు
ధర్మమునకు బాధ సేయు • ధర్మమునెందున్
ధర్మముగా మదిఁ దలఁపరు
ధర్మము సర్వంబునకుహి • తంబుగవలయున్.

క౦. తనకులధర్మము విడువక
మనుటపరమధర్మమండ్రు • మాన్యులుచిత్తం

బునఁగృపగలుగుటముఖ్యావుఁ
బనిసైరణవలయునఖిల ♦ భావములందున్.

క. ధార్మికులుసలుపునుత్తమ
కర్మముఁ జెడునాడునాస్తి ♦ కజనము వినుమా
దుర్మతుల తెఱఁగుఁ గనుఁగొని
ధర్మమునెడఁ బ్రీతివదలఁ దగదుబుధునకున్

క. శరణం బని వచ్చిన భీ
కరశత్రుని నయినఁ బ్రీతిఁ ♦ గావఁగవలయుం
గరుణాపరుల తెఱం గిది
యిరువుగ సరిగావు దీని ♦ కేధర్మంబుల్.

## ఉత్తమగుణములు.

---

క. మనమున వేరమి దలఁపమి
యునుసత్యమచిత్తుఁడగుట ♦ యానుగుణములుకై
కొనిదోషంబులువిడుచుట
యానుత్తముఁడైనపురుషు ♦ నుత్తమగుణముల్

## శీ ల ము.

క. ఒలసిమనో వాక్కాయం
బులదో్రహభావ మఖిల • భూతములయెడం
గలిమి వినుశీలమది మే
లోలయించును దానముల్ల • మూన్నవము పుత్రా.

క. పరహితము సిగ్గుపాటుం
బారయుకయుండంగనెదిరి • బోధించుటయున్
సరసముదయంబు పొగడెడు
చరితము శీలమున కంగ •సంపద వత్సా.

తే. సత్కులంబునఁబుట్టుట • సకల వేద
ములుఁబురాణంబులును శాస్త్ర • ములునుజదువు
టయును సద్గతిఁజేయఁబా్ర • ధములుగావు
శీలసామగ్రిలేని దు • శ్చేష్టితునకు.

## క్ష మ.

క. క్షమగలవానికిఁబృథ్వి
సమునాకు నిత్యంబు విజయ • సంసిద్ధియగున్.

క్షమియైనవానిభుజ వి
క్రమముగడున్ వెలయు సర్వ • కార్యక్షమమై.

ఆ. క్షమయతాల్చియుండఁ • జనదెల్ల ప్రొద్దుఁదే
జంబ తాల్చియుండఁ • జనదుపతికి
సంతత క్షముండు • సంతతతేజుండు
నగుటదోషమందు • రనఘమతులు.

క. క్షమ లేని తపసితపమును
బ్రమత్తుసంపదయుధర్మ • బాహ్యాప్రభురా
జ్యముభిన్నకుంభమునఁ దో
యములట్టుల యధ్రువంబు • లగు నివియెల్లన్.

క. క్షమ మేలగునైననతి
క్షమదైన్యముఁదెచ్చునెదురు • గర్వించినఁ గ
య్యమువాడిచిగెలిచియరిశే
షమునెడసదయక్షమావి • శదుఁడగుటొప్పున్.

సీ, క్రోధంబు పాపంబు • క్రోధంబు ననచేసి
యగుఁజువ్వె ధర్మకా • మార్థహాని
గడుఁగ్రోధి కర్జింబు • గానందు క్రుద్ధుండు
గురునైన నింధించుఁ • గ్రుద్ధుఁడైన
వాఁడవధ్యులనైన • వధియించు మఱియాత్మ
ఘాతంబుసేయుంగఁ • గడఁగుఁగ్రుద్ధుఁ

ఉసాత్మదృశులకు ధ ♦ ర్మాత్మనుబంధులకిట్టి
క్రోధంబు దాల్చుట ♦ గుణమె చెప్పుమ.

ఆ. యెఱుకగలమహాత్ముఁ ♦ డెఱుకయన్ జలముల
నార్చుఁగ్రోధమను మ ♦ హానలంబు
గ్రోధవర్జితుండు ♦ గుఱుకొని తేజంబు
దాల్చుదేశకాల ♦ తత్త్వమెఱిఁగి.

---

## మిత్రుఁడు.

---

జ. మిత్రుం డైహికములునా
ముత్రికములునైనభద్ర ♦ ములుదలకొలుపున్
మిత్రధనంబులలోనను
మిత్రుఁడె యెక్కుడనుమాట ♦ మెత్తురుప్రాజ్ఞుల్.

క. ఉత్తమకులజుఁడు సుగుణా
యత్తుఁడు సస్నేహమతియు ♦ నగుమిత్త్రునకుం
జిత్త మెలర్పు తెఱంగునఁ
బొత్తు మనఁగవలయు శుభముఁ ♦ బొందవలసినన్.

చ. ధనపతితోఁ దరిద్రునకుఁ ♦ దత్త్వవిదుండగువానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁ ♦ గ్రూరునకున్ రణశూరుతోడ భీ

రునకు పరూధితోడ నవ • రూధికిసజ్జనులతోడఁ గష్ట దు
ర్జనునకు నెవ్విధంబునను • సఖ్యము దానొడఁగూడ నేర్చునే.

క. సమశీలవ్రతయుతులకు
సమధనవంతులకుసమసు• చారిత్రులకుం
దమలోసఖ్యమునువివా
హమునగుఁగా కగునె రెండు • నసమానులకున్.

## దుష్కృతి.

క. కఱవుపయిఁగఱవు వారయుచు
వెఱవుపయిన్ వెఱవుదోఁప • విడువనియిడుమం
దొఱఁగమిపైఁబురుషుఁడిడుమఁ
దొఱఁగమిఁజేడ్పడుచు నడచు • దుష్కర్మములన్

## సుకృతి.

ఆ. ఉత్సవంబుమీఁద•నుత్సవమందుచు
సుఖముమీఁద సుఖము • సొప్పడంగఁ
బుణ్యపదముమీఁదఁ • బుణ్యపదంబున
కరుగు నతఁడు సుకృతి • యైననధిప.

## కా పు రు షు లు.

---

క. పలుమఱు శపథంబులు సం
జలియును నభివాదనమును • సాధుక్రియ భా
వలు మిథ్యావినయంబులుఁ
గలయవి దుష్టస్వభావ • కాపురుషులకున్.

---

## దు ర్వి నీ తు లు.

---

క. తగునిదితగదనిమొదలో
వగవకసాధులకుఁజేవ • వారలకెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు • లయినభయంబుల్.

---

## అ క్రో ధ నుఁ డు.

క. అనుపమనియమాన్వితులై
యనూనదక్షిణలఁగ్రతుస • హస్రంబులుసే
సినవారికంటెనక్రో
ధనుఁడు గరంబధికుఁడండ్రు • తత్త్వవిధిజ్ఞుల్.

క. అలిగిననలుగక యొగ్గులు
పలికినమతివిననియట్లు • ప్రతివచనంబుల్
వలుకక బన్నము వడియెదఁ
దలఁపక యున్నతఁడచూవె • ధర్మజ్ఞుఁడిలన్.

---

దానము.

---

క. ఇచ్చునది ధనముపాత్రున
కచ్చుగనొరువేఁడకుండు • నది యభిముఖులై
వచ్చినపూజార్థులవృథ
పుచ్చకసేయునది సర్వ • భూతప్రీతిన్.

---

ద్యూతము.

---

ఆ. కుటిలమార్గులయిన • కుత్సితకితవుల
తోడఁగడఁగిజూద • మాడఁజనదు
దానఁజేసియర్థ • ధర్మవివర్జితు
లగుదురెట్టివారు • జగములోన.

---

## దుర్జనుఁడు.

---

క. తనకిమ్మగునంతకు దు
ర్జనుఁడిష్టుఁడ పోలెనుండి • సర్పమపోలెం
దనకిమ్మగుదును గఱచును
ఘనదారుణకర్మగరళ • ఘనదంష్ట్రలచేన్.

క. తనకపకారము సేసిన
జనుఁడల్పుండనుచు నమ్మ • జడమతివై చే
కొనఁజన దించుకముల్లయి
వనుబాదతలముననున్న • నడవఁగనగునే.

క. ధృతిసెడి వేఁడెడువానిని
నతిథిని నభ్యాగతుని భ • యస్థుని శరణా
గతుఁజంపుట కొడఁబడుదు
ర్మతి కిహముంబరముఁగలదె • మదిఁబరికింపన్.

## దుర్జనసంపద.

క. మదమలినమనస్కుఁడరుం
తుదుఁడు నృశంసుఁడనఁబరఁగు • దుర్జనునకుసం

పదరెడలయ్యును నాతని
మొదలిటెసంపదలతో స • మూలంబు చెడున్.

## కలిమి.

---

క. కలిమియ చుట్టలఁ జేర్పుం
గలిమియ చెలులను ఘటించుఁ • గలిమియ శౌర్యో
జ్జ్వలుఁడనిపించుం గలిమియ
వలుపురుసద్బుద్ధియునఁగఁ • బరఁగంజేయున్.

---

## సత్సంగము.

---

క. తిలలును నీళ్లును వస్త్రం
బులుఁబుష్ప సుగంధవాస • మున సౌరభముం
బొలుపెసఁగఁదాల్పుఁగావున
నలయక సత్సంగమమున • నగుసద్గుణముల్.

## సత్ప్రవకులు.

ఉ. కాలిమి బేర్చువారలును • ధర్మవిధిజ్ఞులు సత్యవంతులున్
లోలతలేనివారు మద • లోభనిరర్థకకోపహీనులు

న్శీలసమేతులుం బలుక • నేర్పుటకార్యముకాన్పు పెంపుమైఁ
జాలుటగల్గుభృత్యులును • సంపద సేయుదు రాత్మభర్తకున్

## ఆరుష్కలు.

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁ జేసి • తఱిఁగిశరీరుల్
క్రూరతరబాధఁ బొందుదు
రా రెంటిని జెఱుతు రార్యు • లమలినబుద్ధిన్.

---

## లోభము.

క. వినులోభమునజ్ఞానం
బునుసదృశఫలప్రదములు • పుట్టునులోభం
బునవజ్ఞానముగావున
జననాయక! లోభముడుగ • సౌఖ్యములొందున్.

---

## తృష్ణ.

క. ఆదిసర్వదోషములకా
స్పదమదిదురితక్రియాను • బంధంబులకున్

మొదలు నిరంతరదుఃఖ
ప్రదమనిమది నెఱిఁగిత్కృష్ణఁ • బాతురుసుమతుల్.

## పుత్రప్రేమ.

ఆ. ఎల్లనెయ్యములకుఁ • దల్లిదండ్రులయందు
సుతులవలనినెయ్య • మతిశయంబు
ధనమెంతగలిగి • ననుసుతరహితుల
కెమ్మెయినిమనఃప్రి • యమ్ములేదు.

## మద్యపానము.

ఆ. మొదలిపెక్కుజన్మ • ములఁబుణ్యకర్మముల్
పరఁగఁబెక్కుసేసి • పడయఁబడిన
యట్టియెఱుక జనుల • కాక్షణమాత్రిన
చెఱుచుమద్యసేవ • సేయనగునె?

## సంఘబలము.

తేఁ బలముగలవానిఁబలువురు • బలవిహీను
లొక్కపైకూడినిగ్రింతు • రుత్సహించి

మధువుఁ గొనసుత్సహించిన • మనుజుఁ బట్టి
కొట్టినిర్జించు మధుకర • కులము నట్లు.

ఆ. కీర్తి లేని వాని • కిని జీవనంబు ని
రర్థకంబు సూవె • యవని మీఁద
నిత్యమయిన ధనము • నిర్మల కీర్తియె
యట్టి కీర్తి వడయు • టశ్రమంబె?
క. ఇలఁ గీర్తి యెంతకాలము
గలిగి ప్రవర్తిల్లు నంత • కాలంబును ని
త్యులకారె కీర్తి గలవు
ణ్యులు; కీర్తివిహీనుఁ డెందు • నుం బూజ్యుండే?

---

## అపాత్రదానము.

---

ఆ. పునుకఁ గుక్కతిత్తిఁ • బోసినపాలును
శ్లథికనిండఁ బోరయు • నట్లు దుష్ట

మైయపాత్రవిషయ ♦ మగునీగిపృథవోవు
నిచ్చుచోటఁ బాత్ర ♦ మెఱుఁగవలయు.

## ప్రజ్ఞ.

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము
ప్రజ్ఞయ నాకంబనంగఁ ♦ బ్రజ్ఞయచువ్వే
ప్రజ్ఞయ కైవల్యంబును
బ్రజ్ఞాసాధ్యములుగాని ♦ పనులుంగలవే.

## కామము.

క. శోకశ్రమతృష్ణలకున్
నీకలిమియమూలమగుట ♦ నీకగపడువాఁ
డేకర్తవ్యముగానం
డో కామమ! నిన్నుఁ దొఱఁగి ♦ యుండెదసుఖనై.

క. నీవాసపఱుపధనములు
గావించెదఁబో వినాశ ♦ కములనుడుపఁగా

నీవశమె కానినీచెడు
లేవగ వుండేదు పెనుప ♦ దేదైన్యంబున్.

చ. సులభమొదుర్లభంబాయని♦చూడనెఱుంగవుగన్నదానిపై
నలముదుకామమా! యిదుమ♦లందఁగఁజేయుదునిందు లేమిటం
గలుగదు నీకు, నీతెఱఁగ♦గాధరసాతలభంగి నీవు స
న్నోలమునఁబోకయుండినినుఁ♦బుచ్చెద బచ్చెనరూపుపోకులన్.

తే. ధనముచేటున విసివి నా ♦ మనమునిన్ను
నీడవిడిచెనో కామమ ! ♦ యేనుశాంతి
దాంతిసత్యక్షమాభూత ♦ దయలఁజెంది
నాఁడ,లోభాదులొందవు♦ నన్నునింక.

తే. కామసుఖదివ్యసుఖములు ♦ కాంతుదొఱఁగు
మేలిషోడశాంశంబునఁ ♦ బోలలేవు,
గానకామమ! నినుశత్రు ♦ కరణిఁజంపి
బ్రిహ్మపురముననుండెద ♦ రాజుఁబోలె.

---

కీడు మేలు.

క. చనినఁజను నున్ననుండు
నృనుజుఁడొకటిసేయఁజేయు ♦నరనాయక! తో

డనతగిలినీడవోలెను
విను చేసిన కీడు మేలు • విడువవు వానిన్.

---

## సుఖ దుః ఖ ము లు.

---

క. సమయంబైనను గుసుమఫ
లము లెట్టు లందోఁచుఁ దరువు • లందటితోఁ గ
ర్మములం బొదవున్ సుఖదుః
ఖము లట్టుల, నిష్ప్రియత్న • కలితోద్యాతిన్.

ఆ. బ్రదుకు చేటు పొగడు • వడుట దూఱొందుట
యూగి వేదుకొనుట • యిట్లు మఱియుఁ
గలుగు సౌఖ్య దుఃఖ • ములు వచ్చు నెడ నెడ
వాని కింత యేల • వగవ సధిప!

తే. సుమతులు గ్రహింప రెండు వా • క్యములలోన
నిర్వాదించెద సుఖదుఃఖ • నియమములను
సర్వమాత్మ వశంబులు • సౌఖ్యదములు,
పరవశములన్నియును దుఃఖ • భాజనములు.

## ఆరణ్యమార్గము.

క. తెలిసికొనఁబడయరొరులా
రణ్యాల పోయెడి తెరువులరసి • యును, జదలంబ
త్తులు, నీళ్లలోన మీనం
బులుపోయెడు త్రోవ లెఱుఁగఁ • బోలునె యధిపా

క. జనను గాఢనిరూపణ
మానసుఁడై యార్యజనుల • మహితవచనముల్
వీనులవినుచు ధర్మము
లైనవి సేయంగఁ దప్ప • కగుఁ దత్ఫలముల్.

---

## అధికమతులు—అల్పబుద్ధులు.

---

ఆ. కార్యగతుల తెఱఁగు • కలరూపు సెప్పిన
నధికమతులు దాని • నాదరింతు
రల్పకార్యబుద్ధు • లగువారలకనది
విరసకారణంబు • విషముపోలె.

## సప్తవ్యసనములు.

---

తే. వెలఁది జూదంబు పానంబు • వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబుఁ • బరుసఁదనము

సొమ్ము నిమ్ము ప్రయోజనముగ ◆ వమ్ము సేఁత
యనెడు సప్త వ్యసనములఁ ◆ జనదు తగుల.

## కృతఘ్నత.

చ. ఒకరుని చేతిప్రోవునుద ◆ దున్నతిప్రాపునుగాంచి యెల్లవెం
టకునుగొఱంత లేక పొగ ◆ డందగు సంపదనొంది యట్టిదా
తకుఁ దుదిఁ గీడు సేసిన కృ ◆ తఘ్ను నిపీనుఁగు నైన రోఁత పు
ట్టక కబళింపఁ గుక్కలునొ ◆ డంబడునే ? కురువంశవర్ధనా !

## కార్యసిద్ధి.

ఆ. కమియఁ బండకుండఁ ◆ గాయఁ గోసినఁ జవి
చేకొకాదు విత్తు ◆ చేటుఁ గలుగుఁ
బక్వమగుదుఁ గోయ ◆ ఫలమిచ్చుఁ జెడదు బీ
జంబుఁ గార్యసిద్ధి ◆ చందమిట్లు.
తే. మాలకరి పుష్పములఁ గోయు ◆ మాడ్కిఁ, దేఁటి
పువ్వుఁ దేనియఁ గ్రోలెడు ◆ పోల్కి, నెదురు

గందకుండఁగఁగొనునది • కార్యఫలము
బొగ్గులకుఁబోలెమొదలంటఁ • బోదువఁజనదు.

---

అసహనము.

---

క. పరులధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు • బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులు లేని వేద • నంబడు నధిపా!

---

పలుకుఁబడి.

క. మనమునకుఁ బ్రియంబును హిత
మునుబథ్యముఁదథ్యమును న • మోఘముమధురం
బును బరిమితమును నగుపలు
కొనరఁగ బలుకునది ధర్మ • యుతముగసభలన్.

క. చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలఁకయు ధర్మంబుఁ బాప • గతియును బెంపుం
దులువతనంబునువచ్చును
బలుకుఁబడిన,కానపోనఁగఁ • బలుకఁగవలయున్.

క. తనువునవిఱిఁగినయలుఁగుల
ననువునఁబుచ్చంగవచ్చు • నతినిష్ఠురతన్
మనముననాటినమాటలు
వినుమెన్నియుపాయములను • వెడలునెయధిపా!

---

## నీ తి.

---

ఆ. నీతి లేనివాని • నిందింతు్రలోకులు
లేదు సేగిలాతి • లేకయున్నఁ
గానమానవుండు • పూనికనయవిద్య
గడనసేయమొదలఁ • గడఁగవలయు.

ఉ. నీతిపథంబునన్ బ్రిదుక •నేర్చుటయుత్తమథంగి, శౌర్యనం
జాతములై కరంబలరు • సంపదలొందుటమధ్యవృత్తి, య
స్ఫీతములైన భారవహ •జీవనముల్దలఁపం గనిష్ఠముల్,
నీతికిబాహ్యులైనధర • నీవర మెత్తురె వారినుత్తముల్.

---

## రూ ప ము.

---

సీ. స్వరమె రూపంబు పరభృత • వర్గమునకుఁ
గొత్రిత్తడితనంబెరూపంబు • కోమలులకు

విద్యయేరూపము కురూపు • లితరికెల్ల
శాంతియేరూపమెప్పుడు • సంయములకు.

## బాంధవులు.

గీ. ఆర్గురే బాంధవులు లోక • మందు నాకు
సత్యమే తల్లి, జ్ఞానమే • జన్మదాత,
ధర్మమే తోఁడఁబుట్టువు • దయయె హితుఁడు,
శాంతియే ధర్మచారిణి • క్షమయె కొడుకు.

## ఉపకృతి—అపకృతి.

గీ. పలికెదశతాధికగ్రంథ • భావమెల్లఁ
దేటతెల్లంబుగా నొక్క • మాటలోన
పుడమిని బరోపకృతి సేఁత • పుణ్యమునకె
పరుల కపకృతి సేఁత పా • పంబుకొఱకె.

---

## ఐకమత్యము.

---

చ. కరితురగాదిఘట్టనయు • గాలియు నొంపదె యొంటియున్న య
త్తరువున నేకభూరుహా వి • తానము గుంపయి పేర్చి బాధలం

బారయునె యన్నదమ్ముల్లును ♦ బొందిననేరిక సాధ్యులట్లుగా
కెరవయినిల్చినంగెలని ♦ కెల్లిదమై పటిపోదు రెంతయున్.

## స్వార్థత్యాగులు.

క. కారణము లేకయును నుప
కారపరత్వమున నొరుల ♦ కార్యంబులకున్
వారనియలజడిఁబడియెదు
వారలచూ యేదుగడయు ♦ వారికి నధిపా.

---

## సత్ప్రవర్తనము.

---

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు లోకనింద్య ♦ ములనుడుగుచు మీ
రినయొకనికలిమి కులుకక
మనుజులతోఁ బొందిపొసఁగి ♦ మనుటొప్పునృపా.
తే. తగినవేషంబు దన్నుఁదాన ♦ పొగడుకొనమి
నొచ్చియున్న గీడు పలుకమి ♦ యిచ్చివగవ

కునికిదన కెంతనడవక ♦ యుప్పఁబథము
దప్పకుండుట నడవడి ♦ కొప్పుసేయు.

## సజ్జనుఁడు.

క. తనులోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ♦ వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక
యునుదన దెసఁ దోఁపనీక ♦ యుడుగుచువచ్చున్.

## ఉత్తముఁడు.

క. పురుషుండు రెండు దెఱఁగుల
ధరనుత్తముఁడనఁగఁబరఁగుఁ ♦ దానెయ్యెడలం
బరుషములువలుకకునికిన్
దురితంబులు వొరయుపనులు ♦ దొఱఁగుటకతనన్.

---

## పుణ్యపురుషులు.

తే. చెల్లియుండియు సైరణ ♦ సేయునతఁడుఁ
బేదవడియును సర్థికిఁ ♦ బ్రియముతోడ

తనకుఁగలభంగినిచ్చున • తండుఁబుణ్యా
పురుషులని చెప్పి రార్యులు • బుధవరేణ్యా.

---

ష గ పు.

---

క. పగ బలముదఱుఁగు గూఁపఱు
పగచిన మతిదప్పఁ దెప్పులు • వచ్చుం దూరన్
పగచినలంగినఁ బ్రియమగుఁ
బగతురకును, పగచుటుదుగు • పార్థివముఖ్యా.

---

ప గ.

---

ఆ. పగయుకలిగెనేని • పామున్నయింటిలో
నున్నయట్లుకాక • యూఱడిల్లి
యుండునెట్లుచిత్త • మొకమాటుఁగావున
వలవదధికదీర్ఘ • వైరవృత్తి.
క. పగయడఁగించుకొంతయుశు • భంబది లెస్సయడంగు నేపగం
బగపగఁగొన్న మారొక్కనక • పల్కకయుండఁగవచ్చునేకదుం

పగ మొదలెత్తి పోవఁబగ • దీర్పఁగ వచ్చిన గార్యమొందునే
యేగతిఁ దలంచినం బగకు • మేలిమి లేమి ధ్రువంబు కేశవా!

---

## సేవాధర్మములు.

---

క. ఎఱిఁగెడువారికి నైనను
గఱపక తక్కుఁ రుచితప్ర • కారము శుభముం
గొఱలు హితులట్లగుట నం
దఱకును జెప్పంగవలయుఁ • దగియెడు బుద్ధుల్.

క. తగఁజొచ్చి తనకు నర్హం
బగు నెడఁ గూర్చుండి రూప • మవికృతవేషం
బగ సమయ మెఱిఁగి కొలిచిన
జగతీవల్లభునకతఁడు • సమ్మాన్యుఁ డగున్.

క. నరనాథుఁ గొలిచియలవడఁ
దిరిగితి వాకేమియనుచుఁ • దేఁకువ వేమిన్
మరియాద దప్పమెలఁగినఁ
బురుషార్థంబునకు హాని • పుట్టక యున్నే.

ఉ. రాజగృహంబు కంటె సభ • రామము గానిలుగట్టఁ గూడదే
యారాజనృపాలుఁ డాకృతికి • నొప్పగు వేషములాచరించునే

రోజవిహారముల్ సలుప ♦ నుల్లమునంగను వేడ్కఁ జేయునే
రోజవిదగ్ధుఁ డైపలుకు ♦ నొద్దులకుం దగునట్లు సేయఁగన్.

క. పుత్రులు పౌత్రులు భార్యలు
మిత్రులనరు రాజులాజ్ఞ ♦ మిగిలినచోటన్
శత్రులకాఁదమయుఁలకకుఁ
బాత్రము సేయుదురు నిజము ♦ భస్థితిపాంజెన్.

క. చనువాని చేయుకార్యం
బునకడ్డముసొచ్చి నేరు ♦ పున మెలఁగుచుఁదా
నునుబయిఁబూసికొనుటఁ దన
మును మెలఁగిన మెలకువకును ♦ ముప్పగుఁబిదపన్

ఆ. రాజునొద్దఁ బలుపు ♦ రకు సంకటముగాఁగఁ
దిరుగుపనులకెంత ♦ తేజమయిన
వాని బుద్ధిగలుగు ♦ వారొల్ల రదిమీఁదఁ
జేటుదెచ్చుబెట్లు ♦ సిద్ధమగుట.

క. ఊరకయుండకవలుపుర
తోరవమెసఁగంగఁబలుకఁ ♦ దొడరుపకమతిం
జేరువఁగలనాగరికులుఁ
దారుఁగలసిపలుకవలయు ♦ ధరణీశుకడన్.

క. వేతాక తెలఁగునవొరులకు
మాటాడకయునికిలెస్స ♦ మనుజేంద్రుకడం

దీటుమిగలచోటులఁదా
మీఁటికడఁగివచ్చిపంపు • మెయికొనవలయున్.

చ. ధరణిపుచక్కఁగట్టెదుట • దక్కఁపిలుంచునుగానియట్లుగా
నిరుగెలనందగంగొలిచి • యేమనునోయెటుసూచునొక్కఁడె
వ్వారిదెసనెప్పుడేతలఁపు • వచ్చునొయాతనికంచుఁజూడ్కను
స్థిరముగఁదన్ముఖంబునన • చేర్చుచునుండుటనీతి కొల్వునన్.

క. నగళులలోపలిమాటలు
దగునేవెలినుగ్గడింపఁ • దనకేర్పడనొం
డుగడంబుట్టినఁ బతివిన
నగుపనిచెప్పెడిదిగాక • యాతనితోడన్.

క. అంతిపురముచుట్టఱికం
బెంతయుఁగీడంతకంటె • నెగ్గు తదీయో
పాంతచరకుబ్జవామన
కాంతాదులతోడిపొందు • కలిమిభటునకున్.

ఆ. ఉత్తమాసనములు • నుత్కృష్టవాహనం
బులునుగరుణఁదనకు • భూమిపాలుఁ
డీక తారమెక్కు • టెంతటిమన్నన
గలుగువారికైనఁ • గార్యమగునె.

క. మన్ననకుబ్బకయవమతి
దన్నొందినసుక్కఁబడక • ధరణీశుకడన్

ముప్పున్నయట్లమొలఁగిన
యన్నరునకుశుభములొందవు • నాపతలడఁగున్.

క. జనపతియెవ్వరి కైనను
మనుపఁజెఱుపఁబూనియునికి • మదిఁదెలియనెఱిం
గెనయేనిఁదానువెలివు
చ్చునెమునుమున్నెట్టిపాల • నుండునుదానిన్.

ఉ. ఎండకువానకోర్చిగన • యిల్లువఱిచానపుఁజోటునాకయా
కొండునలంగుదున్ నిమర • కుందటిదప్పెడు డప్పిపుట్టినో
క్కండనయెట్లొకోయనక • కార్యము ముట్టినచోటనేలినా
తండొకచాయచూపినను • దత్పరతంబనిసేయుటొప్పగున్.

క. తానెంతయాప్తుఁడైన మ
హీనాయకుసొమ్ముగ్రాము • సొమ్ములుగొలో
నూనినభయమునఁబొరయక
పూనినఁగాకెలకులుగు • మానముబఱికుకున్.

ఆ. ఆవులింత తుమ్ము • హాసంబు నిష్ఠీవ
నంబు గుప్తవర్త • నములుగాఁగఁ
జలుపవలయునృపతి • గొలువున్నయెడల బా
హిరము లైనఁగెలని • కెగ్గులగుట.

క. వైరులదూరులునేరవగు
వారునిరాకృతులుఁబాప • వర్తులుఁదమకుం

జేరువగా వర్తించుట
నేరమి తుదిఁ బోయి చేటు • నిందయు వచ్చున్.

౭. వసుమతీశు పాల • వర్తించు నేనుంగు
తోడనైన దోమ • తోడనైన
వైరమగు తెఱంగు • వలవదు తానెంత
పూజ్యుఁడైన జనుల • పొందు లెస్స.

౮. కలిమికి భోగములకదా
ఫలమని తను మెఱపి బయలు • పడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే
డ్కలు సలుపఁగ వలయు భటుఁడ • డంకువతోడన్.

---

## య క్ష ప్ర శ్న ము లు.

### ప్రశ్న.

౧. దినకరు నెయ్యది నడపును
దినకరు నెవ్వారు గొలిచి • తిరుగుదు రద్దే
వుని యస్తమించు టేమిట
ననఘ! ధరాధారభూత • మది యెయ్యదియో.

ఉత్తరము.

తే. అనినధర్మజుఁడిట్లను • నబ్జహితుని
నడపుబ్రహ్మంబు; సురకోటి • నడచుఁగొలిచి;
ధర్మచేనస్తమితుఁడగుఁ • దపనుఁడమ్మ
హాత్మునకుసత్యమాధార • మందుర్బుధులు.

ప్రశ్న.

క. ఏమిటశ్రోత్రియుఁడనఁజను
నేమిటఁగదుమహిమవడయు • నిమ్మగఁబురుషుం
డేమిటసహాయయుతుఁడగు
నేమిటనగుబుద్ధిమంతుఁ • డేర్పడఁజెపుమా.

ఉత్తరము.

క. శ్రుతమువలన శ్రోత్రియుఁడగు
నతులతపోయుక్తిఁగడుమ • హత్త్వమువడయున్
ధృతిచేసహాయయుతుఁడగు
నతిశయముగబుద్ధిమంతుఁ • డగుబుధసేవన్.

ప్రశ్న.

తే. ఏమికతమునభూదేవుఁ • డెసఁగుదేవ
భావమున,నాతనికిసాధు • భావమెవ్వి

ధమునవగు,నసాధుత్వమె ♦ ద్దానఁజెందు,
మానుషుండగునాతఁ డే ♦ దానఁజెపుమ.

ఉ త్త ర ము.

చ. అనవుడుధర్మజుండనియె ♦ నధ్యయనంబునదేవభాగము
గను నవనీసుపర్వుఁ డధి ♦ కవగ్రిశీలత సాధుభావమా
తనికివిశిష్టవృత్తిదిగఁ ♦ దాగ్రివియసాధువసంగనుండు శో
చనియతిలేకమృత్యుభయ ♦ సంగతినాతఁడు మానుషుండ
[గున్.]

ప్ర శ్న.

క. నావినియతఁడాతనితో
జీవన్మృతుఁడెట్టివాఁడు ♦ సెప్పుమనుటయున్

ఉ త్త ర ము.

దేవాతిథిపితృభృత్యజ
నావళులకునిడకకుడుచు ♦ నతఁడనిచెప్పెన్.

ప్ర శ్న.

చ. వినుమగుడంగ వాఁడుప్పథి♦వీపతిఁజూచిధరిత్రికంటె వేగ్రిఁ
కనయగుదాని నాకసము♦కంటెఁ గడుంబొడవైనదాని గా

ద్భవకును నెక్కుఁడై జపము • పొందిరివో యెదుదానిఁ బూరికం
టెనుదలచైనదానిని ఘ • టింపఁగఁ జెప్పుము నాకు నావుడున్.

ఉ త్త ర ము.

ఆ. తల్లి వ్రేఁగుసుమ్మ • ధరణికంటెను నాక
సంబుకంటెఁ బొడవు • జనకుఁ డరయ
గాడ్పుకంటె మనసు • గడు శీఘ్రగతి తృణో
త్కరముకంటెఁ జింత • గరము తఱచు.

ప్ర శ్న.

తే. మొనసి నిద్రించియును గన్ను • మూయ దెద్ది
పుట్టియును జేతనత్వంబుఁ • బొరయ దెద్ది
యరయ రూపు గల్గియు హృద • యంబు లేని
దెద్ది వేగంబు కతమున • నెద్ది వొలుచు.

ఉత్తరము.

తే. అనినఁ గన్నుమూయదు సుప్త • మత్స్యమీను,
పుట్టియును గ్రుడ్డు చేతనం • బొరయకుండు,
హృదయరహితంబు రాఁగూప, • యేఱు రయము
కతన వర్ధించు, నని చెప్పెఁ • గౌరవుండు.

ప్రశ్న.

క. ఎయ్యదిధర్మమునకుఁగుదు
రెయ్యదియాశ్రయముగీర్తి • కిమ్మగుమార్గం
బెయ్యదిసురలోకమునకు
నెయ్యదిసుఖములకు నిక్క • మేర్పడఁజెపుమా.

ఉత్తరము.

క. అమరఁగదాక్షిణ్యము ధ
ర్మమునకుఁగుదురందుః శ్రీ,కీర్తి • మహిమ నెలవుదా
నము , సత్యము సురపురిమా
ర్గము శీలముసంశ్రయము సు • ఖంబులకెల్లన్.

ప్రశ్న.

చ. నరునకునాత్మయెవ్వఁడు ఘ • నంబుగ దైవికమైనచుట్టమె
వ్వరతనికిం దదీయమగు • వర్తనమేమిటనిర్వహించు భూ
వరయతఁడేమిపూనియన • వద్యతఁబొందునెఱుంగఁజెప్పుమీ
వరుడుగనన్ననక్కుఱుకు • లాగ్రణియాతనితోడనిట్లనున్.

ఉత్తరము.

తే. ఆత్మజుఁడుసువ్వెపురుషున • కాత్మయయ్యె
నాతనికిభార్యదైవిక • మైనచుట్ట

మతనిజవిశపర్జన్యు • కతనఁజెల్లు
నతఁడుదానముగొనియాడి • యతిశయిల్లు.

ప్రశ్న.

చ. అనవిని మేటిధర్మమగు • నట్టిదియెయ్యది, యెట్టిదెప్పుడుం
గనియఁగబండియుండు, నెస • కంబుగ నెయ్యదినిగ్రహించినం
దనరుఁబ్రమోదసిద్ధి,నియ • తంబుగనెవ్వరితోడిసంధియెం
దునువికలంబుగాదు పరి • తోషమెలర్ప నుపన్యసింపవే.

ఉత్తరము.

ఆ. వినుమహింస మేటి • యనఁజనుధర్మంబు,
యోగకర్మమెప్పుడు • నొనరఁబండి
యుండు,మనసుకోర్కె • ఖండింపఁగామోద
మొనఁగు,సుజనసంధి • యెడలదెందు.

ప్రశ్న.

తే. అనిననతఁడు లోకమున కె • య్యదియుదిక్కు
జలమునన్నమునెద్దాన • సంభవించు
విషమనంగ నెయ్యది శ్రాద్ధ • విధికినెద్ది
సమయమనిన నిట్లనిచెప్పె • జనవిభుండు.

ఉత్తరము.

తే. సజ్జనులుదిక్కుసూవెయా • సర్వమునకు
నభము ధరణియు జలము న • న్నముద్భ

చించు నెల్లవులు, విషమగు • విప్రధనము
లనఘ! శ్రాద్ధకాలము • బ్రాహ్మణాగమంబు.

ప్రశ్న.

వ. మనుజుం డెయ్యది పరిత్యజించిన సర్వజనప్రియుండు
ను, నిశ్శోకుండును, నర్థవంతుండును, సుఖియును నగును ?

ఉత్తరము

తే. సర్వజనసమ్మతుండగు • గర్వముడిగి
క్రోధమడంచి శోకమునకుం • గొలువుగాండు
వినవె యర్థాఢ్యుండగు లోభ • మొనర విడిచి
తృష్ణ వర్జించి సౌఖ్యంబు • తెరువుం గాంచు.

ప్రశ్న.

వ. పురుషశబ్దవాచ్యుం డెట్టివాండు ? సర్వధనియగు వాం
డెవ్వాండు ?

ఉత్తరము.

క. దివిముట్టి ధరణియంతట
నివిడి మెఱయుచుండు నెవ్వ • ని యశోరమ య
ట్టివిశిష్టచరిత్రుండు య
దువరా! పురుషుండనాం బ్ర • కాశత నొందున్.

ఆ. ప్రియమునప్రియయుంటుఁ • బెల్లగుసౌఖ్యదుః
ఖములు భూతభావి • కార్యములును
నెవ్వఁకిసమంబు • లివి సర్వధనియనఁ
బరఁగుఁజువ్వెయట్టి • భవ్యుఁడనఘ.

## ప్ర థ మ భా గ ము.

## సమాప్తము.



